**తూరుపు రేకలు :**

జీవిత వికాసమునకు దాస్యము చీకటి ముసుగు. ఈ ముసుగులోఁ జిక్కిన వ్యష్టియేమి, సమష్టియేమి మొద్దుబారి పురుషార్థసిద్ధికి దూరమగును. లక్ష్యసిద్ధి లేని బ్రదుకు రాతి బ్రతుకు. దానికంటె మృతి మేలు.

మహాజను లన్ని కాలము లందును, అన్ని దేశము లందును స్వతంత్రులు. ఆస్థితికై వారుచేసిన త్యాగములు, పొందిన కష్ట నిష్ఠురములు సర్వులును మననము చేయవలసినవి. దాస్యమున మ్రగ్గు జీవికి స్వతంత్రుల చరిత్రలు దారిఁ జూపు దివ్వెలు. ఈ సంప్రదాయ మనాదిసిద్ధము.

తాను తరించి లోకమునుఁ దరింపఁజేయు మహాత్ముఁడు సర్వదాపూజ్యుఁడు. గరుత్మంతుఁడు ఆ కోటిలో మొదటివాఁడు. అతని తల్లి వినత. ఐదువందల సంవత్సరములు దాస్యములో క్రొయ్యబారి పోయినది. విధి యనుల్లంఘ్యము. గరుడి పరిస్థితి పారఁజూచినాఁడు. జన్మతః ధీరోదాత్తుఁడు, ధర్మసూక్ష్మజ్ఞుఁడు మాతృఋణవిముక్తికై యతనియెద తపతప లాడిపోయినది. ఏకకాలమున రెండు పీటముడులు విడిపోవలె. కన్నతల్లి దాస్యము, తద్విముక్తి ద్వారమున తన మాతృఋణము. నడుము బిగించి కర్మక్షేత్రమున కురికినాఁడు. త్యాగికి సృష్టి గజగజ లాడును. అడు నేమి? ఆడినది. స్వర్గము పాదు కదలినది. దేవేంద్రునికి మతి జారినది. అమృతకలశము వైనతేయుని వశమైనది. దాస్యవిముక్తి వినత వశమైనది. అన్వర్థుడైనాఁడు పుత్త్రుడు గరుత్మాన్.

ఇది యీకావ్యమందలి యితివృత్తము. ఒక మహాదర్శమును తనోచిత మగు కూర్పు నేర్పులో బిగించుటయే యుద్దిష్టార్థము. నన్నయ ఋషి యన్నట్లు 'ఇది జగద్ధిత' మైనచో ధన్యోఽస్మి.

# కృతజ్ఞత

ఈ గ్రంథముద్రణమునకుఁ గారకులైన మన్మిత్రమణులు శ్రీ ఉప్పలూరి శ్యామలరావు, (గ్రామ కరణం ఉప్పలూరు, కృష్ణా) గారికి సర్వదా కృతజ్ఞుఁడను. శ్రీ శ్యామలరావుగారు నా కాంతరంగికసుహృత్తులు. ఇప్పటికి 18 సంవత్సరములనుండి వారి స్నేహామృతము ననుభవించు భాగ్యము కల్గినది నా ప్రథమకావ్యము 'అమృతసిద్ధి' వెలుఁగు చూచుటకు వీరే కారణభూతులు. ఒక పనికి వలయు సమస్తసాహాయ్యములును చేయుట అరిది. వీరు నా విషయమున 'స్వ' యని భావించి శ్రమించుట యే పురానుబంధమో! ఈ యనుబంధమట్లే సాగుఁగాక!

శ్రీ శ్యామలరావుగారి ప్రేరణమున దీని ముద్రణమునకు రు 60-0-0 అరువది రూపికలు విరాళ మిచ్చి మహారాజపోషకులైన డా॥ శ్రీ శిష్టా గోపాలకృష్ణమూర్తి (జగన్నాథపురం అగ్రహారం, కృష్ణాజిల్లా.) గారికి నా కవితాశీర్వాదపూర్వక కృతజ్ఞతఁ దెల్పుచున్నాను. శ్రీ గోపాలకృష్ణమూర్తిగారు సంపన్నులు. పిన్నలయ్యును మహోదారులై, రసజ్ఞులై భాషా పోషకు లగుట మిక్కిలి మెచ్చఁదగినది.

విరాళముల నిచ్చి, పోషకులుగను, చందా దారులుగను జేరిన మహాశయు లందరికిని కృతజ్ఞుఁడను.

ఈ కావ్యము విని తమ యమూల్యాభిప్రాయ మొసంగిన కవిసార్వభౌములు శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి కనేకాభివందనము లర్పించుచున్నాను.

పై విధమున తోడ్పడిన మహాశయు లందఱికిని శ్రీ కృష్ణ భగవానులు దీర్ఘాయురారోగ్యైశ్వర్యము లిచ్చి రక్షించు గాక!

శ్రీ శ్రీ శ్రీ

**రసికహృదయము :**

శ్రీ మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ, ఆంధ్రవ్యాస, కవిరాజ, అభినవశ్రీనాథ, వేదవిద్యావిశారద, అధునాతనోభయ కవిమిత్ర, స్వర్ణాభిషిక్త, గండపెండేర భూషిత, గజారోహణోత్సవ శిలావిగ్రహ ప్రతిష్ఠాది సన్మాన సత్కృత,

బ్రహ్మశ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి మహోదయులు.

దాస్యవిముక్తి : అను నీ గ్రంథము విజయవాడ పురమునఁ గన్యకాపరమేశ్వరీ హిందూహైస్కూలునం దాంధ్ర పండితులు, ఉభయభాషాప్రవీణ, బ్రహ్మశ్రీ అక్కపెద్ది సత్యనారాయణగారు రచించిరి. వా రీ నడుమ రాజమహేంద్రవరమునకు వచ్చినప్పుడు నాకుఁ దాము రచించిన పై గ్రంథము చాలభాగము చదివి వినిపించిరి. నేను వినినంతవఱకుఁ బ్రతిపద్యమును సవిమర్శముగానే వినియుంటిని. శ్రీ సత్యనారాయణగారి కవిత్వము నాతి కఠిన మృదుమధురముగా నుండును. దీర్ఘసమాస మెక్కడ నుండవలయునో, హ్రస్వసమాస మెక్కడ నుండవలయునో, వ్యస్తపద మెక్కడ నుండవలయునో, తెలుఁగుపద మెక్కడ నుండవలయునో, సంస్కృతపద మెక్కడ నుండవలయునో వీరికిఁ జక్కఁగాఁ దెలియును.

తిక్కనసోమయాజివలె వీరు చిన్నచిన్న పదములు కాహళ సంధించిన విధమున సంధించి మనోహరముగాఁ బద్యములు రచింపఁగలరు. వీరి కవిత్వమున సంస్కృతాంధ్రములు సమత్వముఁ బొందియుండును. సమయోచితము లగు జాతీయములు వాడుటలో వీ రద్వితీయులు.

దాస్యవిముక్తి : అను నీ కథ శ్రీ మహాభారతములో బహుజనులచేఁ జదువంబడుచుండు ప్రాతకథ యైనను, ఇపుడు వీరి రచనం దగిలి నవనవత్వము నొంది సర్వజనమనోరంజకముగా నున్నది. ఇందలి శైలి ధారాళమై, గంగాప్రవాహము వలెఁ బరువు లెత్తుచుండును. మఱియు వీరు అమృతసిద్ధి, తపతీ సంవరణము లోనగు గ్రంథములు రచించియున్నారు. అందును గొన్ని కొన్ని పద్యములు వినియున్నాఁడను. అవి మిక్కిలి మనోహరముగా నున్న వనుట అతిశయోక్తి కాదు. శ్రీ సత్యనారాయణకవిగారు చిరంజీవులై యిట్లనేకగ్రంథము లొనర్చి దేశమాత నలంకరించి యాంధ్రమహాజనుల యాదరణమునకుఁ బాత్రము లగుదురు గాక యని కోరుచున్నాను.

శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

---

## పితృపూజ: అంకితము:

కౌశిక పవిత్రగోత్ర విఖ్యాతమైన
అక్కపెద్ద్యన్వయంబున నవతరించి
అమలకీర్తిప్రభామూర్తులైన కృతులు
స్వర్గతులు పితృదేవతల్ సంతసింత్రు.

మత్పితౄణంబుఁ దీర్పగా మతిఁ దలంచి
తల్లి సీతామతల్లికిఁ దండ్రియైన
వర నృసింహాఖ్యునకు బహిఃప్రాణమైన
బిడ్డ రామమోహనునకుఁ బ్రేమమీర.

అంకితము జేసినాను కావ్యంబు దీని
శాశ్వత సుఖాపవర్గ విశ్రాంతి పదవి
నొసఁగి శ్రీకృష్ణ భగవాను లోముఁగాత
మని మదిష్టదైవతమున కంజలించి.

ఈకృతి దివ్యసౌధమున కేలికలై ననుఁ గన్నవారు, నే
నైకనఁబడ్డవాడును, మహాసుఖులై చిరకీర్తిమంతులై
శ్రీకమనీయ లోకములఁ గృష్ణుని పజ్జఁ దదీయసత్కృపా
లోకమరంద వీచికలలో నివసింతురు గాక నిచ్చలుౝ

* * * *

# వంశాభివర్ణన:

వ. పూర్వుల సదాచారానుసారంబుగఁ గావ్యముఖంబున నస్మత్కృతిపతుల వంశావతారం బభివర్ణించెద.

సత్త్వరాజససామరస్యమ్ము మూర్తి
ఇహపర సమన్వయము జూపు పృథుల పురుష
కారము పొడవు వీరావతారవివృతి
బ్రహ్మఋషి సృష్టిప్రతి గాధిరాజసూతి.

ఆ మహామహు డాదిగా నవని వెలుగు
కౌశికపవిత్రగోత్రవృక్షంబునందుఁ
బ్రసవఫలశోభితం బయి బయలుప్రాకి
అక్కపెద్ద్యన్వయపు శాఖ యలరు మిన్నుల.

ఈ గృహనామ మొప్ప నుతికెక్కిన వీరల కాది పూరుషుం
డే గుణరాశియో యెఱుఁగ నెట్టులఁ గల్గెనో యీయభిఖ్య? ఆ
యోగము లేదు మా కయిన నొక్కటికద్దు తెనాలిసీమఁ జే
రొప్పిగిన కూచిపూడి యెడ ముయ్యేలగుట్టకు వీరివారికిన్.

దాచిన ధనంబువంటిది కూచిపూడి
యని తెలుఁగునేల వెల్లడియైన యూరు
నేటికిని నిల్పఁ బెట్టు నా మేటి పేరు
పసిఁడి పండించు మాగాణి పంట యచట.

అందు వేంకటరామయ్య యను మనీషి
సుగుణఖని విత్తవంతుడు సుఖి యభిజ్ఞుఁ
డత్తవారిది శాయపురాగ్రహార
మమలకృష్ణాతటీక్షేత్ర మమరభూమి.

ఒకనాఁ డాయన పుట్టినింట సుఖులై యున్నట్టి భార్యన్ గుమా
రకునిన్ జూడఁగవచ్చునట్టియెడ మార్గంబందుఁ గృష్ణాధునీ
వికటోత్తాలమహాభుజంగమఫణావిజృంభిత వీచీహతిన్
ముకుళించెన్ గనుఁదమ్ములన్ మనసులో నుద్ధాడి స్వీయార్భకున్.

భర్తృశోకపరిక్లిన్న పరమసాధ్వి
లింగమాంబిక స్వపితృగృహాంగణమునఁ
జచ్చియును బసివానికై చావ దేమొ!
చిగురు నవ్వుల నొల్కఁబోసెను నిసుంగు.

ఆసినీవాలిలో నమృతాంశు వేమి!
హాలహాల భుగభుగలలో నమృత మేమి!
నరకకూపమ్ములో స్వర్గనాట్య మేమి!
శోకపాతాళమున హర్ష పాక మేమి!

వ. ఇదియ దైవచిత్రము. అనంతరము కూంచిపూడిలోని తమ ఆస్తి నంతయు విక్రయించివైచి లింగమాంబ తన తండ్రి యింటనే కాలము వెళ్లించె. తదాది వీరు శాయపుర వాసు లైరి.

వంశాంకూరము వేంకటాచలము శుంభచ్ఛేముషీరాశి వే
దాంశన్ బుట్టినా నా యజుస్సు తన జిహ్వాగ్రంబునన్ నిల్పి శాం
తిం శూరత్వము మేళవించి ఋషివై దేదీప్యమానప్రభన్
వంశోద్ధారకుఁడై యశస్సు గనె నానాదిగ్దిగంతంబులన్.

ఆయన కిద్ద రాత్మజు లహంకృతిమత్ప్రతిభాప్రభావదు
ర్జ్ఞేయులు సూర్యచంద్రులబలెన్ వెలుగొందిరి తాతయింటిలో
శాయపురాగ్రహారమునఁ జావలి వెంకటనర్సు తాతగా
రాయతవత్సలత్వమున నక్కునఁయుం విడి ప్రోదిసేయగాన్.

వీరి తల్లిదండ్రి వెంకటనరసయ్య
పుత్రహీనుఁ డాత్మ పొగిలి తన ద్వి
తీయపుత్రి లక్ష్మీదేవి సభర్తృక
నింట నుంచి పెంచి వృత్తి నిచ్చె.

తన పదునెనిమిది యెకరా
లను గూతునకు నొసగందలఁచి తమ్ముల ప్రా
ర్థన మూడు విభాగములుగ
నొనరించి కుమార్తె కొక్క టొసఁగెను బళిరా!

వ్యష్టియగు సోదరుల కాస్తి పంచియిచ్చి
తన యుదారతఁ జూపిన ఘనుని నరుసు
అనుమతించిన సాధ్వి లక్ష్మమ్మఁ దలఁచి
సత్యకాలపు రూపు చాచవులు గొంచు.

ఈ గతి లభ్యమైన పోల మింతకు నాగేకరాలు దున్ని కొం
చోగును బాగునందునని యొప్పఁగఁ జే తడిఁగాఁగ నీక యొం
తే గరువంబు పేర్మి నిలు దీర్చిరి లక్ష్మియు, వేంకటాచలం
బా గుణుతుల్ విశిష్టముగ నాటినవో కనుపించు నేటికిన్.

ఆ పుణ్యదంపతు లల్లారు ముద్దులు
సుబ్బరాయఁడు మహాసుందరుండు
కోటప్ప వైదికపాటవం బొప్ప ద్వి
తీయుండు—పైతృకం బా యిరువురు
పంచికొని కులము పౌరుష మెంచుచు
ధీరులై జీవిక తీర్చి దిద్ది
పేరు వాసి గడించి తీరు తీయములు గా
పరమార్థమార్గసంపన్ను లగుచు

మేటి గార్హస్థ్యతత్త్వము మేకొనంగ
నిండు నందును సుఖముల నందఁజాలు
రుచిరఫక్కిఁ బ్రవర్తించి రూఢి కెక్కి
చూరగొన్నారు మధురయశోఽమృతమ్ము.

సుబ్బారాయఁడు లౌకికప్రవరుఁడై శోభామనోజ్ఞాకృతిన్
బిబ్బోకమ్ములు గుల్కు ప్రౌఢల రసాపేక్షన్ విగుర్వించి తా
తబ్బిబ్బై చ సుకుమార మోహన కళాద్రాఘిష్ఠ సంస్ఫారతన్
ప్రిబ్బున్ గౌరవభావమున్ జనత సంభావించి యర్పింపగా.

రసికచక్రవర్తి రాయలు విహరించు
రుచిర భూము లెల్ల రుచులు నింపె
రసికచక్రవర్తి రాయలు విహరింప
రుచిరభూము లెల్ల రుచుల నిడవె.

వృత్తి వృద్ధిచేసి విత్తమ్ము నేకూర్చి
వృత్తవృద్ధి చేసి విత్తాఢ్యుఁడయి
భార్య కామమాంబ పరిచర్య సేయుగా
పూర్ణకాముఁ డమృతమూర్తి యతఁడు.

మూవురు కుమారకుల డించి ముద్దుకూతు
లిద్దరను పిడి యర్ధాంగి సేట గింపి
అర్ధశతమైన లేని యర్ధాంతరంపు
నడివయస్సున నిహయాత్ర విడిచి చనియె.

అపుడు కామాంబ ధైర్యము నందగొనుచు
బిడ్డలను బెంచికొనుచు గంభీరవృత్తిఁ
బేరు పెంపు గడించి తాఁ బెద్దఁజేసె
సిరియు సంపద లింట వాసించుచుండ.

వేంకటాచల మాపెకుఁ బెద్దబిడ్డ
తెలివితేటల దీవి పల్కులకొటారు
అవల మగకాన్పు భగవంత మన్నసుగుణి
పదియునెన్మిది యేండ్లకే వదలె పృథివి.

ఆపెకుఁ దృతీయ పుత్త్రుఁడై యశముగొన్న
సుధి నృసింహాండు వాగ్మి విస్ఫుటహృదయుఁడు
కలిత రాయ్యార్యారు వంశముక్తాఫలమ్ము
సీతమాంబ వివాహమై చెన్నుతొలఁకె.

వీరి కడుపు కందవిత్తుగవర్ధిల్లి
పుట్టి పెఱిగినారు ముగురు పుత్త్రు
లాడుబిడ్డ లార్వు రానందమున నిల్లు
దోసతోట వోలెఁ దాణికిసాడ.

అన్నయును నేను నైదుగు రాడుబిడ్డ
లిపుడు మిగిలియున్నాము గతించినట్టి
తల్లిదండ్రుల యాత్మ శాంతము వహింప
కొలము వెంపొందుచున్నది పలువిధముల.

నాదు నర్ధాంగలక్ష్మి పుణ్యముల ప్రోవు
కన్న తొలి మగకాన్పు కన్గప్పారమ్ము
రామమోహనుఁ డేకవత్సరమ్ము దాటి
మమ్ము విడనాడిపోయి స్వర్గమ్ము చేరె.

పిదప నిరువురు కొమరులు వృద్ధికాను
లుదయ మందిరి యొక బాల పిదప కలిగె
మొదటి కాన్పు సుశీల యన్పుత్రితోడ
నల్వు రనుఁగులు పెరుగుచున్నారు నేడు.

బిడ్డలను నన్ను వీడి నా ప్రేమరాశి
లక్ష్మి స్వర్గతురా లయ్యె మ్లానమైన
లేత పున్నాగమొగ్గు ఫలించు పెడలి
చిక్కియున్నాను జీవనశ్రీప్రతీక్ష.

*　　　*　　　*

*　　　*　　　*

సీతాంబా నరసింహులు
మాతాపితృ పాదవరుల పుంజులకీర్తి
స్ఫీతుల సుతురామార్భకు
నాతతప్రేమమునఁ గావ్యముం దలరింతుఁగా.

---

శ్రీరాధాకృష్ణాయనమః.

శు భ మ స్తు.

# దా స్య వి ము క్తి



శ్రీలు పొంగులు వారిన జీవగడ్డ
కళలు మిసమిసలాడిన కామధేను
వమృతరసములు పండిన కమలవనము
భారతము ప్రాణికోటికి ధారకంబు.

అఖిల సర్వంసహాచక్రముఖపదమ్ము
భాగ్యభోగ్యానుభూతశోభాసదమ్ము
మోక్షలక్ష్మీకటాక్ష విస్ఫుటపథమ్ము
పావననదీనదమ్ము మా భారతమ్ము.

అట్టి ఋషిరాజు విశ్వలోకైక విభువు
అట్టి రాచరికమ్ము మహాస్సమృద్ధి
అట్టి జీవనపథము సత్యప్రవృత్తి
అట్టి ప్రత్యణుకీలక మాత్మశక్తి.

ఈ రహస్యము నెఱిఁగియు నెఱుక లేక
రమ్యమృగతృష్ణికలలోఁ గిరాతగీత
సుఖ మపేక్షించి యుచ్చుల నురిగిపోవు
నా యనుంగుల బోధకే నా ప్రవృత్తి.

* * *

## దా స్య వి ము క్తి

కలశవారాశి నమృతసంగతి జనించి
దేవతాప్రభుస్వామ్యమై తేజరిల్లు
వరహయంబగు నుచ్చైశ్శ్రవంబు తొల్లి
తిరుగుచుండెను స్వేచ్ఛఁ దత్తీరభూమి.

పాలతరఁగల మవ్వము బలసికొలువ
నచ్చమైనట్టి తెలికాంతివిచ్చు లోలయఁ
గండ తేరిన మేనిపొంకంబుతోడ
నిండుజాబిల్లి వోలెఁ గన్పించె నదియు.

రాజసము చిల్కుచూపుల లౌల్య మొదుగ
గ్రీవము సడల్చి నిక్కించి క్రేళ్లుదాటి
వింత యొయ్యారములతీవి విరిసికొనఁగ
నల్లనల్లన నడయాడె నా హయంబు.

సాంధ్యకమనీయరోచిఃప్రసారములకు
మధురిమ నొసంగు శీతల మలయవాయు
వా విశాల సముద్ర వీచీవిలాస
లాస్యసంగీత ఫణితి మేళంబులాడె.

ఆ మనోహరదృశ్యసౌఖ్యానుభవము
సచ్చిదానందరసభోగసౌహృదంబు
యోగిహృదయైకవేద్యసాయుజ్యభూతి
అమృతనిర్వృతిపరసీమ యగు కళాప్తి.

ప్రకృతి కల్యాణమంటపాభ్యంతరమున
మంగళసుగీతనాదంబు మాధురిల్ల
విహగ సంతానములు పెండ్లి వేడ్కమీరఁ
గిలకిల రుతించి యుత్సవక్రీడ సలిపె.

యువతియుగళంబు వాహ్యాళిఁ దవిలివచ్చి
తన్మనోజ్ఞత సొక్కి డెందము లమంద
కౌతుకంబునఁ దూగాడఁ గలసిమెలసి
సంచరించుచు సల్లాప సరసఫణితి.

తుంగవీచీకరంబులఁ బొంగిపోయి
వ్యోమ కల్యాణి ముఖసీమఁ బ్రోవులైన
చారు కుటిలాలకంబులు చక్కదిద్దు
రసికవరుఁగాంచి వనిత లుల్లాసపడిరి.

అందుఁ గద్రువ వినతతో ననియె నిట్లు
'సోదరీ! యీ సముద్రుని చోద్యమేమొ?
రసమయంబగు హృదయమర్మంబు దాచి
కౌగిలించుచు నున్నాడు గగనరమణి.

కోడెత్రాచుల మొత్తమ్ము గుములు కట్టి
పన్నిదము వైచికొని పర్వువారు నేమొ?
తళతళ మెఱుంగు లీను కదలిక లెసఁగ
నురువులం గ్రక్కు తరఁగల మురువు గనుమ!

దాస్య విముక్తి

ఊర్మి వెనువెంట నూర్మిక యుదయ మగుచు
దేశకాలాపరిచ్ఛిన్న దివ్యసృజన
నిత్యసత్య మటంచు ధ్వనించుచుండె
దైవభూతులఁ దెల్పు వైతాళికముగ.

పిల్ల తెమ్మెర పిండులు జల్లులాడి
జలదకన్యలపై నీరు చల్లుచుండఁ
జూచి సైరింపలేక యీ సూర్యజరతుఁ
డేమొ! జేగురింపు మొగాన నీసడించు.

హైమశైతల్యసారము నాచికొన్న
యీ సరిత్పతిరాజసహృదయమందు
పరిజ్వలద్బడబానలజ్వాలికాళి
యేల నిక్షిప్త మయ్యెనో యెఱుఁగరాదు.

అనుచు నా మనోహరదృశ్య మన్వయించి
భావనానంతపథముల వ్యాఖ్య సేసి
నిర్మలానంద రసపాన నిష్ఠఁ దవిలి
సంచరించుచు వినతతో సాగిపోయి.

దవ్వులను విహరించు తద్ధయవరంబుఁ
గాంచి 'సఖియరో! యల్లదే' కాంచినావె?
అతిధవళకాంతిరాశి యయ్యశ్వరాజ
మౌర! కన్నుల పండువై యవతరించె.

ఐనఁ బూర్ణేందుబింబంబునందుఁ గల్గు
కందువోలిక వాలంబునం దదేమొ
నల్లనై కానఁబడు' నన్న నగుచు వినత
యుల్లసం బాడెఁ గద్రువ యుల్ల మెఱియ.

'అక్క! యివి యేటి మాటలే? చక్కఁదనము
ప్రోవులై మించు నవయవస్ఫూర్తి మలయఁ
బాలతరఁగలకూటమువోలెఁ గదలు
నశ్వసమ్రాట్టులో నల్ల యన్న నగరె?
ఏ కనులఁ జూచితివో కాని యీ సమగ్ర
తరళసితకాంతిపుంజము, ధరణికొఱుగు
స్వర్గఖండము, మూర్తిమత్స్వచ్ఛయశము,
అమృతకల్యాణదేవతాహాసచయము.'

అని సముత్సాహలహరి పొంగారు ఫణితి
యెడదలోతులనుండి ప్రహ్వీభవింపఁ
బలుకు వినత మాటల కీసు మొలకరింపఁ
గద్రువ పరాభవము నొందు కరణి కుమిలె.

దురభిమానము పెనుచిచ్చు విరిసినట్లు
క్రిమ్మ కలగుండువఱుప రోసమ్ము గదిసి
యుడికిపోయిన యెదతోడ నుమ్మలించి
పలుకు నెగ్గించుకొను పట్టుదల వహించి.

## దాస్య విముక్తి

పన్నిదమువైచె నమ్మహాశ్వంబునందు
నలుపు కలదేని దాసి కావలయు వినత,
లేనిచోఁ దానె దాసీత్వ మూను సవతి
కెంత మౌర్ఖ్యమో సాహస మింతి కంత.

దాస్యపణమున కెంతయు దద్దరిల్లి
దక్షిణభుజాక్షిసంస్పంద దైన్యయుక్తి
జంకియును స్వీయవాద సంస్థాపనార్థ
మొడఁబడియెఁ గర్మబంధంబు గడవరాక.

తనకుమారుని శాపంబు తనకుఁ దెలియు
నశుభశకునంబు లెన్నొ ప్రత్యక్షమయ్యె
సవతిపగ పన్నిదంబున స్పష్టమయ్యెఁ
గాని వినతకు విధి దాటరానిదయ్యె.

ఒండొరులగతిఁ జలమున
నిండిన డెందముల నిక్కి నీల్గుచు వాజిన్
గొండిక పరీక్ష సేయఁగ
ఖండితముగఁ దేలిపోవుగద నిజ మనుచున్.

ధీరతఁ బల్కుచు నుండగ
వారువమును డాయ వినత వడివడిఁ బోవన్
పేరదురునఁ గద్రువ తన
చీరము సెదరంగ మోము వెలవెలఁ బోవన్.

క్షణము నిర్విణ్ణయై త్రిప్పుకొని గభీర
ధీరహాసితాస్యయై పల్కెఁ దేనెలొల్క
'బ్రొద్దుచాలదు నేటికిఁ బోదమమ్మ
ఇంతలో మించిపోయిన దేమి చెల్లి !'

అనుచుఁ దన మాయ తెఱుఁగని వినతఁ ద్రిప్పి
తోడుకొనిపోయె నార కద్రువ కుయుక్తి
స్వాదువాక్కుల మాటునఁ జేదువెడద
కుజనలక్షణ మని యెట్లు సుజన మెఱుఁగు.

*     *     *

పోయి కద్రువ యేకాంతమునఁ గుమార
వర్గముం జేరి పరిదీనవదన యగుచు
జాలి మొలకెత్త ననునయాస్పదములైన
తల్లిమాటల నుల్లంబు పల్లవింప.

'అనుగు బిడ్డలార ! విను డీర లందఱు
వేడుదాన మిమ్ము వేడ్కఁ దీర్ప
నాకుఁ బ్రియముసేసి నా దీవనలు గొండు
తల్లి ఋణముఁ దీర్పఁ దరుణ మిదియె.

తల్లికంటె పరమదైవంబు లేదండ్రు
ధర్మతత్త్వ మెఱుఁగు ధన్యమతులు
మాతృభక్తివంటి మార్గంబు లేదురా
అమృతసిద్ధి నొంద నన్నలార !

దాస్యవిముక్తి

అష్టకష్టము లోర్చి యన్నపానములందుఁ
దొలిభాగ మిడి శ్రద్ధతోడఁ బెంచి
గర్భభార మసౌఖ్యకారియై వేధింప
నవమాసములు నోర్పునను వహించి
కృత్యాద్యవస్థగా నేడ్పించి వేపించు
ప్రసవవేదన డీలుపడి సహించి
శిశుపోషణాకాంక్షఁ జిక్కి సొమ్మైపోయి
పథ్యపానముల జిహ్వను గుదించి
కుడిఁయెడమనాకఁ జేయుచు బడలువడియుఁ
గడుపుతీపునఁ బ్రేమంబు సుడులు తిరుగఁ
గన్నులం బెట్టుకొని వేయిగతులసాకు
తల్లి ఋణ మీగఁ దరమె నా తండ్రులార!

తనువులోఁ దనువిచ్చి యందములు కూర్చి
అసువులో నసువిచ్చి జీవాంశ నొసగి
సుఖములో సుఖ మిచ్చి చిత్సుధలు పోసి
తీర్చి దిద్దిన నా కోర్కె తీర్పరయ్య!

జలధి పరిసరసీమల సంచరించు
నచ్చపుం దెలిదీవి యయ్యశ్వరాజు
వాలమును నల్లసేయు డే పగిది నైనఁ
గామచారులు మీకు దుష్కరము కలదె!

అట్లొసర్చ్తిరేని జయంబు కల్గి
నా పరువు దక్కు దాసియౌ నాక్క వినత
కానిచో నాదు కర్మంబు కాలిపోవ
దాస్యమున మగ్గలేనురా తండ్రులార!'

అనుచు ధర్మంబుఁ జూపించి యనువు తెలిపి
కనికరము రేపి వాత్సల్యమునను ముంచి
మనసు కరఁగించు ప్రియమాత మాట లెల్ల
విని విమర్శించుకొని ధర్మవిధి గ్రహించి.

తల్లి పనిచె నటంచు నధర్మకృతికి
సాయ మొనరింపఁజనునె? సూక్ష్మంబు ధర్మ
తత్త్వ మిట్టి యాభాసలే తప్పుదారి
కీడ్చు, స్త్రీబుద్ధి చాలదే యెంతకైన ?

అని తటస్థులైన తన తనూజులఁ గాంచి
అలుక పేటురేగి పెలుచఁ బలికె,
కడుపు చెడఁగఁబుట్టి కారించు నీచులు
కొడుకు లెట్లు నాకు దుడుకులార!

జనమేజయు డను జనపతి
గొనరించును సర్పయాగ ముమ్మలిక మెయిఁ
కనకన మను నా గుండము
లను బడి మగ్గుండు వెగ్గలం బగుబాధన్.

## దా స్య వి ము క్తి

ఇదియ తగు శాస్తి మాతృధిక్కృతికి నంచుఁ
గద్రువ శపింప వారిలోఁ గలతనొంది
వెఱచి కర్కోటకుం డను నురగసుతుడు
తల్లి పంచిన రూపంబు తనర వెడలె.

అశ్వవాలంబు నేర్పుమై నల్లుకొనుచు
నీల మొనరించి తాల్మితో వ్రేలుచుండె
నెంతకును దెల్లవారని ధ్వాంతమందుఁ
గుంటుపడెనేమొ రేరాణి కులుకునడక?

వెలుగు లోపించి యింద్రియవృత్తి యణఁగి
జీవచైతన్యకళ నీరసించి పోయి
శాంతగంభీరవిలయవిశ్రాంతి క్రమ్మ
నిలచె నిర్వీర్యమై దీర్ఘనిద్రఁ బ్రకృతి.

ఈ యవిద్యావరణభూత మెట్లు విడుచు
స్వస్వరూపానుసంధానపరమబోధ
సచ్చిదానంద మెన్నడు సంభవించు
నని సముద్రుండు ఘోషించె నర్ధరాత్రి.

పవలు కడుపార మేసి సుస్వైరవిహృతి
జిగురు పయ్యెర నులివెచ్చ బిగి కవుఁగిలిఁ
గన్ను మూసి సుఖస్వాప్నికప్రమోద
భరితమై పొంగి యుచ్చైశ్శ్రవంబు కదలె.

అంత కంతకు సాంద్రమై యవధిఁ జేరి
వరుసఁ బురువిచ్చిపోవు తైమిరపటంబు
నొత్తిగించిన తెఱపిలో నూపిరి గొని
తెప్పరిల్లు నుషోదేవి తెలివి తోఁచె.

సృష్టి కడుచిత్రమైనది చిమ్మ మనుచు
పెరిగి పెరిగిన చీఁకటుల్ బిగువు సడలి
విరిగి యంతర్వికాసమ్ము వెలువరించె
నిది లయరహస్య మంచు హసించె ప్రాచి.

దినకరుఁడు మేల్మిబంగారు తేరి నెక్కి
తన సహస్రకరమ్ముల ధరణి దేవి
పులకరింపఁగఁ దాకి ప్రబోధ మిచ్చి
తరలిపోయెను నవనవోత్సాహి యగుచు.

అపుడు కద్రువ యాత్మలో హర్ష ముబుక
నాపుకొని ధీరగంభీర యగుచు నేగి
వినతతో నిన్నటి వివాదవిషయ మేమి
సేసితే పోయి చూచి వచ్చెదమె యిపుడు ?

ఎందుకైన నను మంచిదే సందియమ్ము
కూడ దని పెద్ద లందురు—కొంచెమైన
నిజము నిర్ధారణము సేయు నియతమతికి
నిహపరంబులు కల్గు, లభించు యశము.

## దాస్య విముక్తి

అని సముత్సాహపఱచి యా వినతతోడ
నరిగి వార్వ్యము గాంచుడు నక్కజముగ
వాల మసితంబుగాఁగనంబడియె నంత
వినత దిగ్భ్రాంతి నొంది స్తంభించిపోయె.

ఎట్టివిడ్డూరమో యిది పట్టపగలె
పొడిచినవి చుక్క లీ మాయ సడలుటెట్లొ
నిన్న లేనిది ద్రోహంబు నేడు కలిగె
నేమి సేయుదు? నింక దిక్కెవరు నాకు?

చేతులారఁగ నే నయి చేసికొంటి
నేల రావలె నిలు వీడి యింతదనుక
వచ్చితిని పో! మదించి యీ పన్నిదంబు
నేల సఱచితి బేలనై యేల పోతి.

తత్క్షణము వచ్చి తథ్యమిథ్యాపరీక్ష
నేలఁ జేయకపోతి నా గోలతనమె
నన్ను నింతకుఁ దెచ్చె సంతాప మొంది
యేమి లాభము భోక్తవ్యమే కృతంబు.

అని సమాధాన మొనరించుకొని మనంబుఁ
జిన్నబోయిన మోముతోఁ జివికి చివికి
కద్రువకు దాసియైపోయి కాలగతికి
విస్మయంపడి యాసెతో వెడలె వినత.

*　　*　　*

తన యపూర్వధీకౌశలంబున సపత్ని
దాసియై తన్ను సేవించు దాసి కలిగె
ననుచు పీగెడు కద్రువ కణగి మణగి
పనులు సేయుచు నుండె సద్వినుత వినత.

ఇంతమాత్రపుటోటమి కేమిలెక్క
నవ్వటాలకు నంటిగా కివ్విధమున
ఘోరదాస్యంబు నిజ మనుకొంటివేమొ
యెంత వెఱ్ఱులైనను సమ్మతింతు రట్టె.

అదియునుంగాక పన్నిద మన్ననాడె
చెల్లుబడి యగు, నాటితోఁ జెల్లిపోయె
మన యొడంబడికయుఁ గాన మాటలేల
యొకరి కొకరికి బాధ్యతయుండఁ బోదు.

అది యటుంచుము మోసము నాశ్రయించి
తెచ్చుకొన్న గెల్పదియాట నచ్చమైన
సత్యమును బోలె పాటింపఁ జనదు దీని
భావశుద్ధియె ప్రబలమ్మ పలుకుకంటె.

ఏ పనికినైన ముఖ్యము వృత్తి యగుట
ధర్మము నధర్మమును గల్గు దానివలన
నీ యసద్వృత్తి పణమందె నెగడియుంట
దాస్య మొనరింపవలసిన తగవులేదు.

## దాస్యవిముక్తి

ఈ దృశాక్షేపణల్ న్యాయవాదఫక్కి
సేసి తప్పించుకొనుయుక్తి చేతనయ్యె
పరమసాధ్వీలలామ సత్త్వగుణసీమ
సత్యశీలము వీడదు స్వార్థపరత.

ఆత్మవంచనచేఁ గల్గు నమృతమైన
సత్యవిధ్వంసమునఁ గల్గు స్వర్గమైన
కాలఁ దన్నుచు విషనరకంబు లేని
ధీరత వరింత్రుగా ధర్మవీరు లెందు.

* * *

ఈ నికృష్టాస్వతంత్రబాధానుభూతి
కంత మున్నదె యెన్నటికైన గాని
లేక జీవితశేష మిట్లే ముగింపా?
యను వగపులోన జనియె నేం డ్లైదునూర్లు.

* * *

వినతదుఃఖాంధకారంబు విచ్చినట్లు
తన పతి యనుగ్రహము పేర్మి మును కలిగిన
గర్భ మది యండమై ఘృతకలశమందు
నింతకాలము వర్ధిల్లి యిప్పు డవిసె.

అందు నుదయించె నుల్లోకమైన యొక్క
దివ్య తేజస్సు హరిదంతదీప్తి నొరసి
కృత్రిమతమస్సు శతధావికీర్ణ మగుచుఁ
బెల్లగిలిపోయెఁ గూకటివేళ్లతోడ.

ఆ మహాశక్తి తార్క్ష్యు డుద్దామధాముఁ
డుదితుఁడై యుద్ధృతార్భటి వ్యోమవీధి
కెగసె తతగరుత్ప్రజనితాశుగరయమున
నుదధి క్షోభిల్ల నగము లుఱ్ఱూత లూఁగ.

ఆ మహాబలు దేహనిర్యత్ప్రభాగ్రి
దీధితిచ్ఛట లాకాశవీధిఁ గ్రమ్మ
మహితభాస్కర తేజంబు మాటువడఁగ
వినత కడుపునఁ బాలు వోసెను సుతుండు.

చటులకల్పాంతకాలఝంఝాప్రభంజ
నేరితానలజ్వాలికావార మేమొ
యనఁగ నగ్నిసూక్తములతోఁ దనరు గరుడుఁ
బొగడు మునిదేవతాస్తుతుల్ భోరుకొనియె.

వ. ఇట్లతిలోకమహస్సముదయంబు నా నతిశయిల్లి
చూపఱకు వెక్కసంబగు నక్కజం బుప్పతిల్ల నొక్క
సబు రుప్పరం బెల్లఁ గలయం ద్రిమ్మరి.

# దాస్య విముక్తి

వైనతేయుండు క్రిమ్మఱి వాయువేగ
పృథులపక్షద్వయంబున నెగిరి వచ్చు
కొండయొకిమీనిచందాన గండుమిగిలి
వచ్చి తల్లి పాదాలపై వ్రాలి మ్రొక్కె.

మ్రొక్కిన సుతుఁ గని యెదలో
జిక్కని వాత్సల్యరసము చెరచెరఁ బొంగఁ
అక్కున గదించి తచ్చిర
మొక్కుమ్మడి బాష్పవారియోడిక ముంచెఁ.

గోవుకడుపున నొదిగిన కోడెభంగి
హంసిఱెక్కల నిఱికిన యంచపోల్కి
ప్రాచియొడి నిమిడిన వెల్గురాజువోలె
అంబచేతుల ఖగనాథు డమరిపోయె.

గుండెలు ద్రవించి యేకమై కూర్మిరుచులు
కొల్లగొన నిశ్చలానందకూటమందు
విశ్వరూపానుభవరసావేశవశులు
తల్లి కొడుకులు గని రమృతపరిశాంతి.

ఆ మధురసన్నివేశసౌఖ్యానుభూతి
నొందఁజాలద కద్రువ యుచితవృత్తి—
క్రూరమాత్సర్యకలుషితకుటిలబుద్ధి
రసపిపాస నెఱుంగునె రమ్యఫణితి.

ఈసుచే భగభగలాడు హృదయ మొటిది
స్వాధికారమదంబు గోచరము కాఁగ
వినతసుతుఁ బిల్చి నా ప్రియతనయు లెఁ
నీకు సేవ్యులు వారి మన్నింపు మెపుడు.

అడుగు దాటరాదు బెడిదంపుటాజ్ఞ సు
ఇది యటంచుఁ బ్రభుత యేర్పడంగ
నాన వెట్టె నాపె యతిలోకమహిమాఢ
గాలచిత్ర మింతకన్న గలదె?

జనని యనుమతిఁ గడ్రవ పనుల నెల్ల
వినయపరుఁడయి సేయుచు వెగటుగొన
కాద్రవేయుల మోయు చఖండశక్తి
విశ్వ మెల్లను గ్రుమ్మరి వేడ్క సేసె.

ఆ సుపర్ణునిచలువచే నలతియురగ
కుల మదెల్లను జూడని కుధరములును
విపినములు ద్వీపముల్ దిక్పతిపురములు,
లేవు లేవన్న నత్యుక్తి లేదు సుంత.

అట్లు లప్రతిరోధవిహారు డగుచు
సంచరించుచు నొకనాడు చండకిరణు
మండలము దాఁక నెగసిన మాడిపోయి
సర్పసంతతి నేలపై జారిపడియె.

## దాస్యవిముక్తి

పడుట తడవుగఁ బెనుమూర్ఛపడిన సుతులఁ
గని విషాదరుషార్భటి గరుడుఁ బదరి
తనయులం జేరి యేడ్చె నా తల్లిప్రాణ
మెంతగాఁ గొట్టుకొనెనో వల్పాంత మునిఁగి.

ఆ కడుపుచిచ్చులో రేగి నట్టిమంట
లంతకంతకు ముమ్మరం బయి దహింపఁ
బుట్టుకొని వచ్చె నొకమహామోఘశక్తి
ప్రేమఫల మది త్యాగంబు వీరవిహృతి.

అన్నపానంబులను వీడి యంతరంగ
వృత్తు లన్నియుఁ గేంద్రీకరించి యింద్రు
నమితభక్తిప్రపత్తుల నర్చసేసి
యతని మెప్పించి సప్రశ్రయాంజలి నిడి.

నిలుకడలేక యూగు ధరణీవలయం బది సుస్థిరంబుగా
నిలిపెనొ యెవ్వఁ డద్రులకు నిశ్చలతాప్తి విధించె శాస్త్రమై
కొలిచెనొ యెవ్వఁ డాశుగనిగూఢవిశేషమహాంతరాళముల్
బలమునఁ దాల్చె నెవ్వఁ డుదివంబును నట్టిబిడౌజుఁ గొల్చెదన్.

స్వర్గభూములు నీ ముందు సాగిలఁబడు
పేరు చెప్పిన భూధ్రముల్ వికల మగును
సోమరసపాయి! సౌదామినీమహాస్త్రి!
హ్రాదినీసిద్ధహస్త! పర్జన్య! శరణు.

—ఇర

అని తల్లియాదృష్టిఁ గద్రువ యభినుతింపఁ
బ్రీణితుండయి పురుహూతు డానతీయఁ
బుష్కలావర్తములు కుండపోత గాఁగ
ధరణి ముంచెత్తె యురగులతాప మడఁగ.

వ. ఇట్లతిక్రాంతక్లేశయై కద్రువ మన్నుమిన్నుఁగానక తన భాగధేయంబునకు విఱ్ఱవీగుచు వినతాగరుడుల వలన నుచితానుచితము లెఱుంగని పనులు గొను చున్నంత నొక్కనాడు గరుడుండు వేసటఁ గొని తల్లి కిట్లనియె.

అహము పోనాడి యున్నదున్నట్లు నుడువ
సాహసించెద తల్లి! నన్ను సైపు మమ్మ
నా స్థితికి నాకు బానిసదుస్థితియటె
గుండె తేలంగ మునిగెను బెండు లకట!

ఱెక్కకొన యీఁక విసురున రేగిపోయి
కొమ్మ తిరిగిన కొండలే కుతిలబడును
ముక్కుదెబ్బకు దువ్వయై పోవు సకల
మట్టి నా కట్టె? పాడుదాస్యంబు జనని!

ఉష్ణమని యూద మాయమై యూరు పేరు
లేక మసి యగు పురుగులమూక మోసి
కాయకాచెను నా వెన్ను, కన్నులందు
వత్తు లిడుకొని పనిసేయ వలసెనేల?

## దాస్యవిముక్తి

ఎన్నటికినైన విడుదల యున్నె మనకు ?
విధినియతి యంచు నేల నీ పిఱికితనము
పురుషకారము లుప్తమైపోయె నట్టె
పట్టి సాధింపలేమె యీ పాటి స్వేచ్ఛ?

వ. అని కటకటంబడు ఖగేశ్వరునకు వినత తనకుఁ గద్రువ
తోడి పన్నిదంబుననైన దాస్యంబును దత్కారణం
బైన యనూరుశాపంబును విస్తరించి యిట్లనియె.

నీవలన నాదు దాస్యంబు పోవు ననెడి
యమృతవాక్యంబుఁ జేకొని యాత్మలోన
నెగులుమాని సమాశ్వస్తహృదయ నగుచు
వేచియుంటిని నీకయి ప్రియతనూజ!

తనయులు ప్రయోజకులుకాఁగ తల్లిదండ్రు
లిడుమలం బాసి సుఖియించు టెందు గలదు
కాన నిను గాంచియును దిక్కులేనియట్లు
దాసినై యుందునే కన్నతండ్రి చెపుమ.

అనిన వాడిప ల్కెడద దూసికొనిచనంగఁ
బొగిలి పొగిలి సుపర్ణుండు పొలకు వెఱఁగి
కాద్రవేయులఁ జేరి యీ కరణిఁ బలికె
కర్ణపరిపక్వ మగు జాడఁ గాంచినట్లు.

అన్నలార! నా దొక మాట నవధరింపు
డెంతకాలమునుండియొ యీ యసభ్య
దాస్యశృంఖలఁ జిక్కి మా తల్లి నేను
నోదిగియుంటిమి మీ కెల్ల విదిత మిదియు.

దీనిఁ బాయు నుపాయ మేదేని గలదె
తెలియఁ జెప్పుడు మీ కోర్కె దీర్తు నిపుడు
ఎంత దుర్ఘటమైన సాధింతు గాక
స్వేచ్ఛ యొక్కటె నా కతిప్రియము సుండు.

అని వచించిన నాగు లత్యంతముదము
నొంది దాస్యవిముక్తికి నూహ సేయు
దేని సుధ దెచ్చి యిమ్మనీ దైనబలము
విక్రమంబును దర్పంబు వెలయునట్లు.

అన విహంగేంద్రు డట్లకా నమృత మిచ్చి
ముక్తినొందెద మిర్వురమును ధ్రువంబు
ననుచు నవ్వార్త తెల్పి సుధార్థ మరుగ
మొక్కిన కుమారు నెత్తి నమ్మోదిత వినత.

మాతృత రసించి వాకలై మధురయోగ
నిశ్చలానందసాంద్రచంద్రికలఁ బర్వఁ
గనుల జడిగొను కోష్ణవాఃకణము లారసి
అమృతదృగ్జ్వాల పుత్రమస్తమునఁ బెనచి.

## దాస్య విముక్తి

ఓయి నాకూన! యెన్నాళ్ళ కోయి వింటి
గండకత్తెర నొక్కుళ్ళనుండి తప్పి
ప్రజల మొగములు చూచు శుభప్రవృత్తి
కడుపుపండిన భాగ్యంబు గలిగె కుఱ్ఱ!

కాని యేలాకో! నామది కలత నొందు
అమృతసంగ్రహణం బన్న నలతి పనియె?
వజ్రితో ఘర్షణం బనివార్య మగునొ?
ఈ యభాగినికై యెంత యిడుమ వచ్చె.

నిన్నుఁ బసివానిఁ గని కృపాస్విన్ను లగుచు
నీ మహాత్యాగవృత్తికి స్నిగ్ధు లగుచు
సాక్షిదేవత లెల్ల నిఁక రక్ష సేసి
జయము నిత్తురుగాత నీ శ్రమల కెపుడు.

పోయిరావయ్య నీ ధర్మబుద్ధి యదియె
నీకు శ్రీరామరక్షయై నిలుచుగాత!
తుషితమాతృనురాగవిద్యుత్ప్రికాస్తి
నీకు వజ్రాంగి జోడు కానే యగుఁగద!

ఒక విశిష్టతాపరివేష ముజ్జ్వలించు
జేత వయి ధ్రువతారకాసిద్ధి నొందు
మతుల కులదీపకఖ్యాతి నందు మయ్య
యనుచుఁ గురిపించె దీవనల్ తనివిదీర.

తలమునకలైన దీవన
కలిమిని గరుడుండు నలరి గమనోన్ముఖుఁడై
బలమిడు నాహారము తన
కలవడ నెఱిఁగింపు మనఁగ ననె వినత యిటుల్.

కడలిగర్భమందుఁ గల దసంఖ్యముగ ని
షాదగణము లోకఖేదకరము
కూర్చు మేలు ప్రజకుఁ గుత్తుక బంటిగా
దాని మెక్కి చనుము దండి కలుగు.

భక్షణంబునందు బ్రాహ్మణు విడువుము
దీని నెఱుఁగు విధము తేటపఱతు
మ్రింగబడియు నెవ్వఁ డంగిలి జారక
యగ్నివోలె నేర్చు నతఁడె ద్విజుఁడు.

విప్రకోపము దారుణం బప్రతిహత
ఘోరశస్త్ర మది కాలకూటవిషము
అతఁడు పూజితుఁడైన జనాళి కెప్డుఁ
గొంగు బంగారమై నిల్చి కోర్కె లిచ్చు.

అని యెఱింగించు వినత వీడ్కొని సుపర్ణుఁ
డభ్రపథమున కెగసి తారాధ్వ మంటి
వాయుమండల మెల్ల బీభత్స మగుడు
రివ్వనం బాఱె గోళముల్ త్రెస్సిపోవ.

## దా స్య వి ము క్తి

ప్రళయవేళాసముద్విగ్న పంచభూత
విపరిణామద్రుతావర్తవివృతపటలి
ముంచుకొని వచ్చినట్లు క్షోభించిపోయి
రోదసీకుహరమ్ము మార్మ్రోగె నపుడు.

దివిజనాథుని గుండెలోఁ దెలియకుండఁ
జనుపబండలు పెక్కులు జారిపడియె
ఉన్నదున్నట్టె పదు నెల్ల నుడిగి పోవ
నంచు మణఁగెను దంభోళి కన్ని పెడల.

ఇది మహోత్పాత మని నిర్ణయించె జనము
ఏ మహాపాతకంబు ప్రవృద్ధ మగుచుఁ
జరమరేఖలఁ బెటిలెనో ధరణి యెల్ల
నాదిగికొనిపోయె నుత్పాత లూగి యూగి.

వ. ఇట్లు పఱచి పారావారగర్భంబునఁ జొచ్చి యందలి నిషాదుల నసంఖ్యాకుల నొక్కుమ్మడిగ మ్రింగిన నం దొక్కపాఱుండు కంఠబిలంబు నడ్డగించి జ్వాలనంబు వోలె బాధింప నెఱింగి, నా కుత్తుక బ్రాహ్మణుడున్నవాఁడేని వెలువడునది యనిన ఖగేశ్వరున కా బాపఁ డిట్లనియె.

అగును నీ వన్నయట్లు బ్రాహ్మణకులుండ
నాడు సహచరి కలదు నిషాది యొకతె
దాని విడనాడి వచ్చుట ధర్మ మగునె
యెంత యపవిత్ర యేని నా గృహిణి కాదె!

అనవుడు క్షణంబు యోజించి యనియె తార్క్ష్యుఁ
డవని దేవాశ్రయంబున నధములైన
గౌరవార్హులె పో! బహిర్గతుడ వగుము
నీదు ప్రియురాలిఁ దోడ్కొని నిమిషమాత్ర.

వ. అనిన నా బ్రాహ్మణుండు నిషాదితో బయల్వడి గరుడు నాశీర్వదించి చనియె. అంత క్షుధాకీలలు చల్లారక.

వైనతేయుండు ద్రుతగతిఁ బఱచి గంధ
మాదనంబునఁ దపియించు మహితుఁ దండ్రిఁ
గశ్యపునిఁ గాంచి ప్రణమిల్లి కార్యదీక్షఁ
దెలిపి యాహారమును బ్రసాదింపు మనిన.

కశ్యపబ్రహ్మ తనుజాతు కడఁక కలరి
పల్కె నిట్లు బుభుక్ష తీర్పంగ వెరవు
వత్స! వినుమయ్య, కలడు విభావసుడను
నవనిసురుఁ డొక్క డర్థార్థ్యుఁ డగ్నిసముఁడు.

## దాస్య విముక్తి

అతని యనుజుఁడు సుప్రతీకాఖ్యుఁ డరిగి
పైతృకంబైన భాగ్యంబు పంచి యిమ్ము
న్యాయముగ నాకు సోదరా! యన విభావ
సుండు మండిపడి శపించె సుప్రతీకు.

తిట్టువడి యాగ్రహవ్యగ్రధీకుఁ డగుచు
నతఁడు ప్రతిశాప మిచ్చె నన్యోన్యశాప
ఫలితముగ నన్నదమ్ములు ప్రబల కమఠ
మత్తశుండాలజన్మంబు లెత్తి రంత.

పూర్వవైరంబు పేరేపఁ బోరుచుండు
నొండొకటితోడ నెడతెగకుండ నెపుడు
వాని భక్షించి చనుము శుభంబు కలుగు
ననిన నుప్పొంగి సెలవు కైకొనియె నతఁడు.

అది పరచుటయకాదు విహాయసమున
నొక్కచో మాయమై పోయి యొక్కచోటఁ
దేలినట్టుల గజకచ్ఛపాల నడుమ
వ్రాలి రెంటిని బట్టి యభ్రమున కెగిరె.

అతిమనోహరసురభూరుహాళిచేత
దివ్యసుందరదృశ్యంబు తేజరిల్లఁ
జల్లఁదనముల సుఖములు కొల్లఁబెట్టు
పావనాలంబతీర్థంబుపజ్జ నిలిచె.

నిలిచిన వీరుని కడిమికి
నలరుచుఁ దరురాజ మొండు నాదరణముమై
లలితస్వాగత మీయఁగఁ
బొలుపునఁ దత్ప్రథుల విటపమునఁ గాలూదెన్.

ఫెళపెళారావముల దిశల్ వ్రీలిపోవ
విహగకోటులు గుండెలు విచ్చి పఱవ
ధరణి కెల్లను వ్రేఁగయి విరిగె నంత
గొమ్మ యొక్కటి మిన్నులు కూలునట్లు

అమ్మహాశాఖ ప్రేలుచు నరుణకిరణ
జాల మాహారముగఁ గొంచు సత్త్వశుద్ధిఁ
దపము చేసెడి తాపసోత్తములఁ జూచి
ధరణిఁ బడనీక దానినిఁ గఱచిపట్టె.

ఎంత దేశంబుఁ దిరిగిన నేమి తనకుఁ
గాలు నిలుపంగఁదగు చోటు కానరామి
గంధమాదనమున కేగి కశ్యపర్షిఁ
గాంచి మ్రొక్కెను వినయంబు గదుర నతఁడు.

పసిఁడికొండపోలెఁ బ్రత్యక్షమైనట్టి
తనయు దివ్యతేజుఁ గని యతండు
నాత్మ సంతసించి యాతని ముఖశాఖ
వ్రేలు మునులఁ జూచి వెఱఁగుపడుచు.

## దా స్య వి ము క్తి

వేడుకొనియె నిట్లు విశ్వహితంకర
వృత్తి నున్నవాఁడు బిడ్డ వీఁడు
మీకు బాధ యగుట మేకొని తరుశాఖ
విడువలేడు కరుణ వీనిఁ గనుడు.

అరుగ రయ్య మీర లనుకూలమగు చక్క-
కనిన మౌనివర్య ప్రార్థనంబు
నాదరించి వెడలి రట వాలఖిల్యులు
మంచుమలకు గరుడు నెంచికొనుచు.

అంత గరుడుండు ముఖశాఖ నస్త్రై యుంచి
మాటలు పెకల్చుకొనిపల్కె మహిత తేజ!
విప్రరహితంబు కాననవిషయ మొండు
నానతీయుడు ప్రీతిబంధ మయ్యె నిద్ది.

అనుచు విజ్ఞాపనము సేయు నాత్మజాతు
ధర్మసూక్ష్మజ్ఞతకు మెచ్చుదల ఘటింపఁ
బలికె ఋషిరాజు వాత్సల్య మొలుకునుడుల
'మనసునకు వచ్చె కుఱ్ఱ! నీ ఘనమనీష.

ఇచ్చటికి లక్షయోజన మేగుదేనిఁ
జూడ గలవాఁడ వచట నిష్పురుషనగము
హైమపర్వతకందరప్రాంతసీమ
మానవాగమ్య మచ్చోట దీని విడుము.'

అనినఁ దండ్రిని వీడ్కొని యనిలవేగి
పఱచి తరుశాఖ కొండపైఁ బారవైచి
హస్తికూర్మంబుల హిమాద్రి నాహరించి
పూర్ణసత్త్వంబు నొంది స్వర్భూమి కెగయ.

ఱెక్క సడలించి విసరిన ఱేగుగాడ్పు
నుద్ధతికి మ్రాకు లెల్ల నుఱ్ఱూత లూఁగి
కుప్పతిప్పలుగాఁ బూలు కురియసాగె
విజయుడగు వీరుపైఁ బుష్పవృష్టివోలె.

వన్నెగున్నలు మందలై యేగుపగిది
నాకసం బల్లుకొనిపోవు నభ్రపటలి
ఛిన్నమై నాల్గుదిక్కులఁ జెదరిపోవ
గరుడి యుడువీథి రత్నమై కాంతులొలసె.

అట దివంబున నాగామిపటువిపత్తుఁ
దెలుపు దుర్లక్షణంబులు తీవరించె
నింద్రుకొలువున నంగారవృష్టి ప్రబలె
భీకర మూఁడివోయె దిక్పతుల్ భీతులైరి.

ఈ మహోత్పాతముల కేమి హేతు వనుచు
నడలి యడిగిన సురపతియాత్రి మెరిఁగి
గురుఁడు లోఁజూపున సమస్త మెఱిగికొనుచుఁ
బలికె నిట్లు విషాదసంభ్రమము లొదవ.

# దాస్యవిముక్తి

ఏమి సెప్పెదు సుల్లోకధాముఁ డొకరుఁ
డెత్తి వచ్చుచునున్నాఁడు మిత్తివోలె
వాని చరితంబు నద్భుతావహము భయద
మేమి మూడెడునో దేవభూమి కిపుడు.

కశ్యపబ్రహ్మవరమునఁ గలిగి వినత
కతిబలాప్తినిఁ బక్షీంద్రుఁ డగుచు వెలసి
జలధిగర్భస్థఘోరనిషాదగణము
మ్రింగి భువనంబులకు నెల్ల మేలు చేసి.

అంత నాకలి వోక దుర్దాంతభంగిఁ
బోరు గజకచ్ఛపంబులఁ బూని పట్టి
రోహిణం బను శాఖతో సాహసించి
నభమునం బాఱె నీతం డనల్పగతిని.

ఇపుడుఁ దనతల్లి దాస్యంబు నీఁగఁ బూని
యమృతహరణార్థమై వచ్చెనయ్య! యితఁడు
కామగమనంబు రూపంబు గలఁడు కాన
నీ కసాధ్యుండు సుమ్మెట్లు నిర్వహింతొ.

ఈ సుపర్ణప్రభావంబు నీవు నయిత
మెఱుఁగుదువు జ్ఞప్తి కెలయింతు నింత వినుము
కశ్యపప్రజాపతి పుత్రకాముఁ డగుచు
నీవు మొదలుగ దేవతానీకములును.

వాలఖిల్యాదితాపససర్గములును
దనకుఁ దోడుగ నిల్వఁ జేసెను సుతేష్టి
నాఁడు నీ బల్మికొలఁది నింధనచయంబు
మోచికొని తెచ్చుచుంటి సమ్మోదకలన.

మార్గమధ్యమునందు సన్మునివరులు
వాలఖిల్యులు స్వల్పేధ్మభారవహులు
మాటికి వడంకు నంగుష్ఠమాత్రదేహు
లతికృశీభూతు లగు వారి నపహసింప.

సిగ్గుపడి క్రుద్ధులై మునిశ్రేష్ఠు లపుడుఁ
బుత్రుఁ డుదయించుగాక సంపూర్ణ తేజుఁ
డజితుఁ డణిమాదిసిద్ధుఁ డింద్రాతిరిక్త
వీర్యసంపన్నుఁ డపర దేవేంద్రుఁ డనుచు.

వీర్యవన్మంత్రముల నగ్ని వేల్చుచున్న
నెఱిగి కశ్యపుపాలికి నరిగి నీవు
దయ ప్రసాదించు మంచు బ్రార్థనము సేయ
నా ప్రజాపతి మునులతో ననియె నిట్లు.

ఓ మహామహులార! మీ రుజ్జగించు
నిశితవాక్సాయకావళి నిర్నిరోధ
మెఱుఁగరో నలువ నియోగసరణి నిట్లుఁ
దారుమా రొనరింపగాఁ దగవె మీకు!

## దాస్య విముక్తి

మూఁడు లోకంబులను గల్గు భూతకోటి
భాగ్యరేఖలు పాలించు ప్రభు వితండె
యింద్రుఁ డగుగాని రెండవ యింద్రుఁడైనఁ
గకవికలుగాక యున్నె లోకప్రవృత్తి ?

ఐన మీమాట చెల్లింపు లగుట వలయు
గాన జనియింపఁబోవు నాకూన విహగ
కులమునకు నెల్ల నింద్రుఁడై వెలయుగాక
ఈ సమన్వయఫక్కి మీ కిష్టమగుత.

అని సమాధానపఱచి కశ్యపుఁడు మునులఁ
దావకేంద్రత్వ మేకసుస్థాపితంబుఁ
జేసె నా ప్రజాపతి యజ్ఞసిద్ధిమహిమ
మునితపశ్శక్తి తోడయి వినతయందు.

ప్రభవ మంది ఖగేంద్రుఁడై పరగు గరుడుఁ
డమృతహరణార్థమై వచ్చునట్టికతనఁ
బుట్టె నిట్టివి విడ్డూరములు బిడౌజ!
వేల్పునేలకుఁ బ్రళయంబు విఱిగిపడియె.

అని గురుండు వచింప సురాధినేత
మొడఁదఁ జెయివెట్టి కలచిన ట్లడలుఁ జెంద
నుస్సురని వేడి నిట్టూర్పు లురలిపోవ
నడితుపాను కవుంగిలి నావగతిని.

గిలగిలఁ దన్నుకొనుచు వెగ్గలపుటూహా
దొంతరలు దొంతరలు గాఁగ దొరలిపోవఁ
దల పగిలిపోవు తీవ్రవేదనల సెగలు
మిగుల నక్కిఱి బిక్కిఱి యగుచు నరిగి.

ఒకపరి మూర్ఛన నెంచును
నొకపరి నిస్పృహ వహించు నొకపరి రోష
ప్రకటన గతిఁ దల యూచును
వికటంబుగ నవ్వు పండ్లు పెటపెటఁ గొఱుకుఁ.

పిఱికితనం బేలా నా
కఱకుదనంబునకు వేళ గద యిది యేలా
వెఱచుట కొండలు తఱిగిన
నెఱవాఁడి కటారి లేదె నిప్పుక లుమియన్.

నా యమేయప్రభావంబు నా యనంత
శక్తిసంపన్నత యఘోరసాహసంబు
వీరవిక్రమపౌరుషోద్వేలవిఖ్యాతి
విశ్వవిదితము నా కేల విభ్రమంబు.

అమరనాథుఁడ ననుమాట నాదమఱచి
లేనిపోని గజిబిజిలో లీనమైతి
జ్ఞాపకము వచ్చె దేవతాసార్వభౌమ
పదవిరాజిని నతిలోకబలుఁడ నేను.

దా స్య వి ము క్తి

గరుడుఁ డొక లెక్కచేయ వాని కావరంబు
చించి చెండాడి యశము స్థాపించువాఁడ
నని వినిశ్చితబుద్ధియై యమృతగోప
వితతి రావించి తగునాజ్ఞ వెట్టి పంచె.

పరిభువునానతి తలఁ దాల్చి వార లపుడె
ఘోరశస్త్రాళి సమకూర్చి వీరగంధ
మలఁది పటుతరాంగత్రాణములు ధరించి
యుబుకు నుత్సాహమునఁ బొంగు లొలయుచుండ.

జబ్బలు చఱచుచు దేహము
లుబ్బగ భుజబలముఁ గొల్చి చూరినకండల్
గొబ్బునఁ ద్రిప్పుచు మగటిమి
పర్బిన కనుగొనల చూపు వాఁడిమి యెసఁగన్.

రొమ్ములు విఱుచుచు నటు నిటు
నెమ్మెరపై కొమ్ములేన్గు లేమొ నడచునాఁ
గుర్మమ్మరుచు బయలు జిమ్ముచు
ధిమ్మని గర్జించి కత్తి ద్రిప్పుచుఁ గడఁకన్.

పెండ్లికిఁ దరలిపోవ సువ్వీళుల నూదు
స్నాతకపుఁబెండ్లి కొడుకుల ట్లూతకొనుచు
దూకుటకు సర్వసిద్ధమై తోఁణుకులాఁడు
వీరమూర్తులు వేనకువేలు చేరి

పవలురాత్రులు కన్నుల వత్తు లిడక
క్షణము విశ్రాంతి గోరక షష్టిఘటిక
లప్రమత్తులై నిలఁబడి యమృతభాండ
రక్షణము సేయుచుండిరి రూక్షశిక్షు.

అట దివంబున కెగిరి మహాజవమున
నుల్కగమివోలె సంపతదుగ్రహేతి
మండలము చాడ్పునను భ్రమమాణగోళ
సన్నిపాతవిజృంభణజ్వాలనమట్లు.

ప్రళయకాలంపు ద్వాదశబ్రధ్న కూట
చాలనము ధిక్కరించు తేజస్సమూహ
మంబరము నిండి కకుబంత మాశ్రయింప
వచ్చె ఖగరాజు రాజసం బచ్చుపడఁగ.

వచ్చి యొకాయొకి సుధకడ
కచ్చట గుమిగొన్న రక్షకావళి గుండెల్
విచ్చి యథాయథలై పో
నుచ్చైర్నాదమున దాఁకె నుత్కటధాటిన్.

ధైర్యముచిక్కబట్టి ప్రతిఘాటికి హెచ్చరికల్ హుషారులున్
శౌర్యరసప్రసంగములు సాహసకార్యబహూకృతుల్ రణ
స్థైర్యవిశిష్టగౌరవపదంబులు నొండొరులాడుకొంచు బల్
తూర్యనినాదముల్ సెలగ ధూర్తత దాఁకిరి వారలాతనిన్.

## దాస్య విముక్తి

పలురకముల ఘోరాయుధ
ములు విచ్చలవిడిగ విసరి పొడిచి నఱుకుచుఁ
దల పగులఁ జఱచి పెట్టుచు
బెలబెలమని చుట్టు మూఁగి పెడబొబ్బలతోఁ.

ఆర్చియుఁ బేర్చియుఁ జావుకు
గూర్చిన వగతోడి జంకుగొంకులు నావే
శార్చుల దగ్ధంబై పో
నర్చించిరి శిలయశక్తి నమరులు రక్తిన్.

తల విరియఁబోసికొని పొలికలను దిరిగి
మండు నాల్కల జాపి బ్రహ్మాండ మెల్ల
మ్రింగ నుఱికెడు నున్మత్తమృత్యుదేవి
ప్రళయనృత్యాట్టహాసవిభ్రమము గ్రమ్మె.

క్రూరదంష్ట్రాసహస్రముల్ కొనలు విచ్చి
వికటభీషణహాసమ్ము వెడలఁ గ్రక్క
రణపిశాచినిరంకుశప్రభుత చెల్లె
వేడిక్రొన్నెత్తురుల వన్నె విరిసికొనఁగ.

శాంతి నెఱుఁగని క్షుత్పిపాసలు దహింప
పలలపర్వతములు తేలి పరుగులెత్తు
పృథులరుధిరప్రవాహముల్ పీల్చి పీల్చి
త్రేన్చి గట్టున గతిలేని ప్రేతవితతి.

ఒక్కపెట్టునఁ దనమీఁది కుఱికినట్టి
వైరివీరుల కెడ మీఁక బహుముఖముల
కసిమసంగి విజృంభించి కదనభూమిఁ
బీన్గుపెంటలు గావించి పిచ్చలించి.

పక్షవిక్షేపమునఁ బాంసువర్షమొదవ
శత్రుదృక్పథమును గప్పి స్వర్గలోక
మాకులం బొనరింప న య్యమరనాథు
నాజ్ఞఁ జెదరవీచెను దాని నాశుగుండు.

అట్టియెడ భౌవనుం డను నమరశూరుఁ
డాగ్రహోదగ్రుడై వివిధాయుధాళి
నేర్పనం దాల్పగల సైన్యనివహములను
వెంటఁ గొనివచ్చి కవిసె నా విహగపతిని.

తాఁకుట తడవుగ నేనా
నీకముతోఁ గూడ వాఁడు నెఱమంటలపై
దూఁకిన శలభముగతి భ
స్మీకృతుఁ డయ్యెను తదీయమేదురధాటిన్.

తక్కంగల జేజేదొర
లొక్కుమ్మడి పెచ్చుపెరిగి హోరున దాకన్
ముక్కున రెక్కల గోరుల
రక్కుచుఁ జెండాడి పతగరాజు జయించెన్.

## దాస్య విముక్తి

శల్యములు పిండియగు దాక సహన మూని
చరమపరమాణువున శక్తి చచ్చుదాక
నిస్పృహోన్మాదసాహసోన్మేషశౌర్య
తైలదీపంబు కునుకునందాకఁ బోరి.

ఎత్తువడి కాందిశీకులై వృత్రఘాతి
మఱువు సొచ్చిరి కతిపయామరభటాళి
మడమ త్రిప్పిరి సాధ్యులు, మద మడంగి
వెన్ను జూపిరి మిగిలిన వేల్పుతెగలు.

హేమాహేమీ లగు దిక్
స్వాములె యేదిక్కు లేక నసిచెడి నానా
భూముల నక్కిరి యదవద
లై మానంబునకు నెక్కు డగునో యనువుల్.

హతశేషు లమృతరక్షకు
లతులపరాక్రమము జూపి యంతిమయత్నో
ద్యతులై కడు తెగఁబడి త
చ్ఛితనఖనిస్త్రింశముల నశించిరి పెలుచన్.

ఏవంవిధవిజయశ్రీ
వ్యావర్తకహర్షరసబలాధికతేజ
స్సేనధియై వినతాసం
జీవనమణి పొడిచి నడచి చేరెన్ సుధకున్.

దట్టముగ నా ప్రదేశంబు జుట్టు ముట్టి
తీవ్రఝంఝూప్రభంజనోద్రిక్త మగుచు
విస్తృతాఘోరహేతిజిహ్వికలు చాచి
నభము రుచి జూచు దారుణానలము గాంచి.

గిఱ్ఱునన్ మరలి చని యుత్కృష్టమైన
సకలనదుల జలంబులు సంతరించి
పుక్కిటం బట్టుకొని వచ్చి పోసి పోసి
యమ్మహావహ్ని జల్లార్చె నతఁడు కడఁక.

అంతతోఁ దీర లే దా మహాత్ము శ్రమలు
నిశితధారాన్వితము దేవనిర్మితంబు
భ్రామ్యమాణంబు యంత్రచక్రంబు కలదు
దానిబారికిఁ దప్పెడు దారి లేదు.

దాని యారాంతరంబు సుతారి యతఁడు
సంకుచితదేహుఁడై చొచ్చి సాగిపోయి
దానిక్రింద నాశీవిషద్వయము గాంచె
మృత్యుదేవీప్రియంకరాపత్యయుగళి.

క్రోధరసము గ్రక్కు ఘోరముఖంబులు
చిచ్చుమంట లుమియు విచ్చుగనులు
పెఱలఁ జేరనీక విసములు విసరుటల్
కలిగి యమృతరక్ష మెలగె నవియు.

# దా స్య వి ము క్తి

స్వీయపక్షరజోవృష్టిచేత వాని
నంధములఁ జేసి శిరముల నవియఁ దన్ని
యెదురులేని కడంకఁ బ్రీహ్యాభవించి
అమృతకలశంబుఁగోడ మిన్నంటిపోయె.

యుద్ధమునఁ బెక్కువీరుల నోర్చి యొకఁడ
కరము నాయాసపడి పొందు కష్టఫలము
అమృత మాస్వాదింపక నిగ్రహంబు పేర్మి
నిలచిన సుధీరు గని హరి పలికె నిట్లు.

మనసు వచ్చినవాఁడవు మాన్యగుణుఁడ!
మెచ్చికోలయ్యె నీ ధర్మమేధ కుఱ్ఱ!
లౌల్యరహితంబు త్యాగం బమూల్య మయ్యె
వేయిమడుగుల, నిష్టంబు వేడు మిత్తు.

అని దయామతిఁ బల్కిన యాదిదేవు
శ్రీ మహావిష్ణు పదపీఠిఁ జేరి మ్రొక్కి
భక్తిభరితాంతరంగసువ్యగ్రమూర్తి
మనవు లర్పించె దివ్యసమాధివశత.

'ఓ ప్రభూ! అల్పజీవికి యోగ్యమేని
వీని కజరామరత్వ నిర్వృతి సుధాన
పేక్షముగ నిచ్చి భక్తి సేవింప నిమ్ము
నిరతమును నీ పవిత్ర సాన్నిధ్యమందు.

కదలె లోకేశు కడఁగంటి కరుణరేఖ
భాగధేయంబు పండె నా పతగపతికి
స్వామి గరుడధ్వజుం డయ్యె వైనతేయ
వాహనము నెక్కి తిరిగెఁ దత్ప్రభృతి ప్రభువు.

ఆ మహాప్రసాదంబున కంజలించి
నిర్భరానంద వందనానేక శతము
లధికభక్తి సమర్పించి యాజ్ఞ గొనుచు
బఱచెఁ దారాపథంబునఁ బక్షినేత.

సొత్తు చే జారిపోవుట జూచి చూచి
కరము నుమ్మలికమ్మునఁ గ్రాగిక్రాగి
తెన్ను దోచక నిస్పృహాధీను డగుచు
వానిపై వజ్రమును వైచె వాసవుండు.

ఆయుధరాజం బదియు వి
హాయసమున నగ్నికణము లదరి చెదరగా
వే యరుదెంచి ఖగేశ్వరు
నాయత పక్షముల దాకె నాయిత మైనన్.

అతఁడు హసియించి దానితో ననియె నిట్లు
నీ ప్రతాపంబు నాముందు నిష్ఫలంబు
ఆర్షమవు దేవనాయకు నాయుధంబ
వగుట నవమాన మొనరింపఁ దగవు కాదు.

## దాస్యవిముక్తి

నాదు ఱెక్కల నొకయీక నఱుకుకొనుము
ఇంతకంటెను లేదు గత్యంతరంబు
నాఁగ సిగ్గిలి కులిశంబు మూఁగవోయెఁ
బొగడిరి సుపర్ణుఁ డని వాని భూతకోటి.

ఘనులఁ దత్తదుచితస్థితి గౌరవించి
తమదు ఘనతకుఁ దగిన యౌదార్యగుణము
వెల్లడింతురు మహాత్ము లెవ్వేళనైన
శక్తిగల్గియు క్షమఁబూను సరణి యిదియ.

దీనిఁ గనులారఁ జూచిన దేవమౌళి
పతగనాథు మహానుభావంబు మెచ్చి
అక్కజంపడి యతనితో ననియె నిట్లు
గడుసుదనము గుణజ్ఞత కలసిపోవ.

ఓ యతిలోకవిక్రమ! ఖగోత్తమ! నీ మహిమానుభావముల్
పాయవు నామనంబున శుభంకరమైన భవత్సుహృత్త్వమా
ప్యాయముగా నొసంగవె! మహాత్ములసంగతి సర్వసౌఖ్యసం
ధాయకమాట యబ్బురమె? ధర్మరహస్యము వారిసొమ్ముగా.

కశ్యపబ్రహ్మ చైతన్యగాఢశక్తి
వినత సౌశీల్య శాంత గంభీర ముద్ర
చేరుకొన్నవి వీరావతారమూర్తి
నీ జనుస్సున జయలక్ష్మి నిలుచుటరుదె?

ఎంతవాడవు కానిచో నంతనంత
సాధ్యపడఁబోని స్వామిపత్నిసచ్ఛదృకుఁ
తఱపి వెన్నెల తేటలఁ దడిపె నిన్ను
నమరమూర్తికి నీకు జోహారు లివిగో.

అఖిల ముపపన్నమైన నీ కమృతమేల
ఇది యొక వినోదకేళిగా కితర మగునె?
పరుల కిత్తువా? యేమొ మా ప్రాణధనము
సురల కాయువు పట్టుసూ! సుధ, పయస్య!

అన్యు లమృతాంధులైనఁ గృత్యాద్యవస్థ
తప్ప దనులందు దేవతాతతికి నింకఁ
బిట్టపోయిన గూడుగా వేల్పునేల
బోసిపోయిన దటుచూడవో యభిజ్ఞ!

ధాతృనియతికి బాధావిధాత వగుట
సుంత పరిశీలనంబునఁ జూడఁగలవు
మాది మా కిచ్చుటయు మడిమాన్యములుగ
నెంచి నీకోర్కెఁ జెల్లింతు నెఱుక పరపు.

విని విని పతంగరాజు కన్గొనల నగుచు
ధీరగంభీరముగ వజ్రి తేరఁ బలికె
నా యనుఁగుతల్లి దాస్యంబు నపనయింప
కాద్రవేయుల కమృతప్రదాన మయ్యె.

## దాస్యవిముక్తి

తీవరించిన నా మాతృదేవి వ్యథలు
రాలిపోయెడి శుభముహూర్తంబు గదిసె
నవ్యకళ లూరు నాతల్లి నవ్వుమోము
అదిగో! కన్నుల వ్రేలిన ట్లయ్యె నాకు.

చిమ్మచీఁకటి గొలుసులఁ జిక్కువడిన
యామె జీవితమున వెల్గు లవతరింప
దీని నురగుల కర్పించి తెమలిపోదుఁ
గడమకార్యంబునకు సిద్ధపడుము నీవు.

అని యుపాయంబు జూపిన నాత్మ మెచ్చి
యతని బలవిక్రమంబుల వితము తెలియ
నుత్సహించిన పురుహూతు నుల్లమలర
ఘనుఁడు గరుటాలమంతుండు వినిచె నిట్లు.

ఎంత యోగ్యత తనయందు నిమిడియున్న
నంతరంగానుభవమె యోగ్యంబు కాని
వాచ్య మొనరింప సారంబు వాడిపోవ
సజ్జనుండు తనంత తాఁ జనునె పలుక.

ఆత్మగుణగౌరవంబున కాత్మహత్య
స్వీయ ముఖతః ప్రసంగవిస్తృతి నిజమ్ము
అయిన నీ యుత్సుకతఁ దన్పు సమలవృత్తి
నా విభూతి వచింతు దిఙ్మాత్రముగను.

## దాస్య విముక్తి

భూరిభూధరభార విస్ఫార మగుచు
విస్తృతారణ్యనదనదీవిభవ మగుచుఁ
బరిచలితానంత జీవి పర్యాప్తమైన
వితత విశ్వంభరను దాల్చి వెన్నుకొనల.

ఈ బృహత్పృష్ఠవిక్షేప హిండితాశ
గద్రితంబునఁ గడలి యగాధజలము
నెల్ల జలజంతువులతోడఁ జల్లివైతుఁ
దిరిగి వత్తును ద్రుటిలోనఁ ద్రిజగములును.

కెరలి బ్రహ్మాండభాండంబు గ్రిందుమీదుఁ
జేయఁగల సాహసము స్వతస్సిద్ధగుణము
ఆత్మవిశ్వాసబలము దృఢాంగరక్ష
నిశ్చితార్థంబు సాధించు నియతి వ్రతము.

అని వచించు గరుడు సతిలోకశక్తికి
నబ్బురంబు గదుర నలరి జిష్ణుఁ
డనియె నతనితోడ సశ్రాంత మీవు నా
గుండెకాయ వింతసుండి నిజము.

ఇంత యుపకారివైన నీ కేమి జేతు
నిష్ట మొనరింతుఁ జెప్పు మోయీ సఖుండ!
అనిన నాగర్భశత్రువు లైన మదులు
కాద్రవేయులు బోనమౌఁ గాక నాకు.

## దా స్య వి ము క్తి

నీ పతాకము చల్లని నీడలందు
వేసివేయక సుఖియించు విష్టపముల
లేలిహానము లెల్లఁ జరించు కతన
పాకశాసన! నీ యాజ్ఞ బడయవలసె.

అని గరుత్మంతుఁ డుచితమర్యాదఁ బలికి
యనిమిషేశ్వరు వరదాన మందుకొనుచు
నతఁడు తో తేర ముచ్చటలందు మునిగి
తలుపు తట్టెను తల్లి పాదాల వ్రాలె.

అమృతకలశంబుతోఁడఁ బ్రత్యక్ష మైన
పుత్రరత్నము జూచి యుప్పొంగిపోయి
రార ననుఁ గన్నతండ్రి! గారాలకూచి!
రార నాప్రాణమా! సౌఖ్యరాశి! రార!

ఎన్ని కడగండ్లు వడినాడొ చిన్నకూన!
ఈ యభాగ్యురాలి నిమిత్త మెంత కస్తి
కలిగెనో యన్న! కడుపు బంగారుపంటఁ
దత్త మొనరించితిని పాడుదాన నకట.

ఏర యిదియేమి నాయనా! యీ మొగంబు
మిగుల వసివాళ్లు వాడి క్రొమ్మిసిమి తఱిగె
సుప్రసన్నము లక్షులు సొక్కిపోయె
రెక్క నలిగినదో బాబు! రేక జారె.

# దాస్య విముక్తి

సహజకోమలమైన నా చక్కనయ్య
తనువు బిరుసెక్కి కఱకుదేరిన దదేమి?
పెసరకాయలవంటి యీ పసరుగోళ్ళు
సానబెట్టిన తరవారులైన వేమి?

ఇంతకును మూలమైన నా కేల బ్రిదుకు
అగును 'పాపీ చిరాయు' వటన్న సూక్తి
దాస్యమున బండపాఱిన దాన నాకు
మొండికట్టెకు దయయన్నదుండు నోటు?

అని కొడుకు నక్కునఁ జేర్చుకొని పరిపరి
విధముల వినత వాపోవ విస్తుపోయి
వింజ మూకిడినట్టు లా వీరవరులు
వరుస నిలచిరి కిమితి బ్రువాణు లగుచు.

రాతిగుండెలు కరగించు రసమయంపు
వాక్యముల వెల్లివిరిసిన వత్సలత్వ
మెడఁదలోతులలోఁ బ్రవహించి పొర్లి
కనుల జడివానగాఁ బల్కె గరుడి యిట్లు.

అమ్మరో! యింత కడుపు తీపైన నెట్లు
కొడుకు లెందును దల్లుల యిడుమ వాపి
సుఖము లెగఁబోయు త్యాగంబు చోద్యమగునె
తల్లి ఋణమును దీర్చెడి త్యాగ మెంత?

# దాస్య విముక్తి

నీమహానందనవనవోన్మేషమధుర
మంజులజ్యోత్స్నలోఁ బరమార్థ గీతి
నాలపించెడి భాగధేయంబె నాకు
బ్రహ్మతాసిద్ధికిని రాచబాట తల్లి.

తలఁచు ప్రియమైన దమ్మ స్వాతంత్ర్యలక్ష్మి
కడు నమూల్యము నపురూప మిడుమమాఁగ
యమృత మిచ్చికొనవలసె నమ్మ నేఁడు
తదుపలబ్ధియే పరమ ప్రధాన మగుట.

అనుచుఁ దల్లి నోదార్చి యా యమృతపాత్రి
బసరు నిగనిగ నవకపు పచ్చిదర్భ
మోసులం బెట్టి సవతితమ్ములకుఁ జూపి
పలికెఁ బన్నగభోజి శుంభద్వచస్వి.

మన యొడంబడిక ప్రకార మనిమిషాధి
పతిసుగుప్తమై కష్టసంప్రాప్త మైన
యమృత మిది మీకు నిచ్చితి నన్నలార!
దీనిఁ గైకొని మాబాధ దీర్పుడయ్య.

కర్మసాక్షులు సాక్షులు గలరు మనకు
దొలఁగె మాతల్లి దాస్యశృంఖలము లిపుడె
ఇంక స్వాతంత్ర్యసామ్రాజ్య మేలగలము
ఈ వసంతోదయశ్రీలఁ జేవదేరి.

ఖగ

క్రొత్తచిగురులు గుబురులు గుబురు లగుచు
మొలుచుకొని వచ్చి సొగసులు ప్రోవు సేయఁ
గమ్మ నెత్తావి పూగుత్తి రెమ్మ దొడిగి
మధువు లొలికింపఁజాలు నీ మావిమోక.

అమృతమధురము లీ రసాలములు ఫలము
లావృతానందములు విశ్వజీవకములు
స్వీయరసస త్త్వమునఁ జిత్తవిత్తుగాఁగ
శాంతిసుఖములు మొలిపించుఁ జలువ దుక్కి.

కులుకుకోకిల ముత్తైదువులకు విందు
చిలుక కన్నెలకును బండుగల పసందు
తేటికూనలకును బాలతేట యూట
కలుము లెగఁబోయు నీ మావిమొలక యింక.

ప్రకృతిగతమైన స్వాతంత్ర్యవాయులహరి
గోముగా శ్యామలచ్ఛవుల్ కొసరి కొసరి
రోజు కొక వన్నెగా వచ్చు ద్రుమకిశోర
మెంత విశ్వవికాసమ్ము నెనసికొనునొ?
నేడుగా పొద్దుపొడిచె ననేకయుగము
లంధకారమ్ము విచ్చి సమ్యఙ్మహస్సు
లలముకొన్నవి నిత్యకల్యాణములును
బచ్చతోరణములుగా శుభమ్ము లిచ్చి.

# దాస్యవిముక్తి

ఈ మహానందసుముహూర్త మెంత మధుర
మెంత మసృణసమీచీన మెంత సుషమ
మెంత మంగళకర మెంత హ్రీమనోజ్ఞ
మంతు లే దెన్న దీనికి నెంత విలువ?

చాలు నతివిస్తరం బేల శాశ్వతంపు
ముక్తివైభవ మమరె మీ మూలమునను
నెల్లరును స్నాతులై యలంకృతుల రగుచు
సుధను జుఱ్ఱుడు జుబ్బనజూరగాఁగ.

అని నియోగించి విహగరాజాధిరాజు
జననిఁ దన వీపు నెక్కించుకొని యుదాత్త
ధీరుఁడై పన్నగముల కదృశ్యుఁడైన
శత్రుఁ గనుసన్న వీడ్కొని సాగిపోయె.

అమితవిక్రమసంపద నధిగమించి
గోత్రభేదిని భేదించి కోర్కె లొంది
తల్లి ఋణ మీగిన విశిష్టధర్మవేది
కర్మవీరునిచరిత ప్రజ్ఞానఘనము.

ఋషిత వడదేర్చు సార మాకృతిగ మలచి
యుదితమైన పరాక్రమజ్యోతి వెలుగు
విశ్వములు నిండి త్యాగపావిత్ర్యశోభ
తోరణము గట్టు విభవ మత్యున్నతంబు.

* * *

ఇట్టు లనిదంపురావ్యక్తిహేతు వైన
వైన తేయనిష్క్రమణము నైన వెనుక
మనసు నునుతీపుపిండి బ్రహ్మాండ మెల్ల
మ్రింగ నెంచు నహంత నోర్విచ్చి పెలుచ.

కాలు నిల్వగనీని కదలింపు టుద్వేగ
ముత్సహింప నురగు లుబికిపోయి
ఒకరికంటె ముందు నొకరుగాఁ ద్రొక్కిస
లాడుకొనుచుఁ బెనగులాట మునిగి.

ఒక్క బుటక వేసి యుఱుకుచుఁ గై సేసి
యూడిపడక మున్నె యుద్యమించి
కోపు కాచియున్న కులిశంబు గల జోదు
కలశ మెత్తికొనుచుఁ గదలిపోవె.

కను మూసి తెఱచునంతన
దన ప్రోల్పొలిమేర నిలచి ధైర్యపుటూర్పుల్
ననలెత్త వెనుక ముందులు
గనుగొని అమ్మయ్య! నేటి కాపద తప్పెన్.

కుదుటఁ బడినవి జీవము లదరిపోతి
నడుగడుగునకు హంసపా దయ్యె బ్రదుకు
ఇంద్రపద మన్న శిక్షకు వృజిన మేమొ
నాలికోఁతల సుఖములు చాలుఁ చాలు.

# దాస్యవిముక్తి

ఈ యమరావతీ సుమవనేరితరాజ్యము లేలి వచ్చు నీ
వాయుకిశోరసంతతుల పాటల నాటల పారవశ్యమో
గాయతి కోటిసేయదె? సురాధిపతిత్వ మదేల నిర్వృతి
స్థాయిరసప్రలుబ్ధమతి సద్యుడుదాత్తపదంబు నీయదే.

బ్రహ్మానందానుభవా
జిహ్మస్థానంబు కావ్యసేవ్యము రుచిర
బ్రాహ్మీపదమంజీర
బ్రహ్మధ్వనినాదఘనము రసరాజ్య మహో!

ప్రకృతి యొడిలోన బిడ్డనై పరిమళములఁ
దఱుముకొని వచ్చు చిఱుగాలి కెరటములకు
నొరిగి పోవుచు నీ పచ్చిపరుపులందు
ననుపమాద్వైతరససిద్ధి నందుకొందు.

ఈ నా బంగరు గడ్డపై నిలువ నా
కేమో నవోత్సాహముల్
మే నెల్లన్ జిగిరించె నింత మధురం
బే మాతృదేశంబు స్వ
స్థానం బన్నను వేషభాష లనినన్
సాహిత్యవేత్తల్ సమీ
చీనప్రేక్షణు లంట సత్య మిది సూ
స్త్రీయానుభావం బహో!

నా యన్నదానిలోఁ గల
తీయఁదనంబునకు సాటి తేఁగలమె ? జగ
చ్ఛ్రియము లొదిగిన సూత్ర
ప్రియపుసిద్ధాంత మదియ పరిణామగతిక.

అని మురిసిపోయి తనకుఁ దానై దర్శించి
భావనాజగత్తులఁ దేలిపోవు నెడఁద
మఘవు డమరావతీరాజమార్గమందు
శోభనపుఁబెండ్లికొడు కయి చొక్కిపోయి.

లేతనునుసిగ్గుపొరలలోఁ బూఁత లెత్తి
నలిగిపోయిన యమృతసౌందర్యనవత
లోక విశిష్టమాధుర్యము నూట లూర
వెలుఁగుకోవలు తీరిన విచ్చు మొగము.

విశ్వవిజయమ్ము సేసిన విభవ మొలయఁ
బౌరకాంతల మంగళహారతులకు
నింక నంతయి పౌలోమి యెదురు వచ్చి
ముసిముసి పసందునవ్వుల పూజ సేయ.

విబుధకోలాహలమ్ముల విన్ను వీథుల
వందికైవారముల తీపు లందుకొనుచుఁ
దాను బ్రియురాలు నైరావతంబు నెక్కి
నందనోద్యానవాటికలందుఁ దిరిగి.

## దాస్య విముక్తి

అమృతభాండము సుస్థానమందు నిలిపి
వేయికన్నులతోఁ బర్యవేక్షణంబు
సేయుచు రహస్యహర్మ్యాగ్రసీమలందు
హంసతూలికసెజ్జల నధివసించి.

మసృణమందారసుమపరీమళలహరుల
మంజుకల్పకమకరందమధురఝరుల
అమలచింతామణీకోమలాంశుఘనుల
నమృతభోగి శచీజాని నైక్య మెనసె.

జయ లోకత్రియ సార్వభౌమ! త్రిదశ
స్వామీ! శచీవల్లభా!
జయ భూభృచ్ఛయభేది! వీరవిహృతీ!
స్వాతంత్ర్యయోగవ్రతీ!
జయ ధర్మావనదీక్షితా! భిదురహ
స్తా! వైజయంతీప్రభో!
జయ పర్జన్య! యటంచు హెచ్చరిక లా
శల్ నింపు ప్రీతస్సుఁడై.

విజయదశమీమహమ్ములు వెలయుచుండఁ
గార్తికజ్యోత్స్నలో శరత్కాలసుమము
విందు గుడుచుచు వీరాధివీరగణము
వైనతేయసుధాగీతిఁ బాడుకొందుర్.

ఈ గ్రంథ ముద్రణమునకు విరాళముల నిచ్చి
నాకుఁ దోడ్పడిన మహాశయులకు
శ్రీ రాధాకృష్ణ భగవానులు సమస్త సంపత్సుఖముల నిచ్చి
రక్షించుగాక!

మహారాజపోషకులు

శ్రీ డా. శిష్టా గోపాలకృష్ణమూర్తిగారు, L. M. P.
Land Lord, కంకిపాడు, కృష్ణా. 60-0-0

శ్రీ ఉప్పలూరు శ్యామలరావుగారు, గ్రామకరణం,
Land Lord, ఉప్పలూరు, కృష్ణా. 50-0-0

పోషకులు

శ్రీ అన్నే రామకృష్ణమ్మగారి కుమారుడు
వెంకటరత్నంగారు, భూస్వాములు, ఉప్పలూరు, కృష్ణా. 10-0-0

చందాదారులు

శ్రీ చెలసాని పద్దయ్యగారు,
భూస్వాములు, ఉప్పలూరు, కృష్ణా. 5-0-0

శ్రీ చెలసాని నాగభూషణంగారు,
భూస్వాములు, పునాదిపాడు, కృష్ణా. 5-0-0

శ్రీ చెఱుకూరు వెంకటసుబ్బయ్యగారు,
భూస్వాములు, మంతెన, కృష్ణా. 5-0-0

# పడిపూలికా గ్రంథమాల

నేటికి వెలుగు చూచిన కుసుమములు.

## అక్కపెద్ది సత్యనారాయణ గారి గ్రంథములు

౧. అమృతసిద్ధి  8 అ.
పద్య కావ్యము
మద్రాసు, ఆంధ్ర, విశ్వ
కళాపరిషత్తుల చే ఇంటర్మీడి
యేటుకు పఠనీయముగ నిర్ణ
యింపబడిన మధుర కావ్యం.

౨. దాస్యవిముక్తి  1 రూ.
కవిసార్వభౌముని ప్రశం
సల నందిన కావ్యరాజము.
గరుత్మంతుడు అమృత
మిచ్చి తన తల్లి దాస్యమును
తొలగించుట ఇందలి ఇతి
వృత్తము.

## పైడిపాటివారి రచనలు

౧. తూణీరం  8 అ.
గేయగుచ్ఛం
కవిత్వంపై చురుకు
విమర్శ

౨. దేశం (జాతీయ గీతములు)
దేశభక్తి ప్రబోధంతో
ఆంధ్రుల ఆదరాన్ని చూర
గొన్న గ్రంథం.  8 అ.

౩. నీలం (కథాసంపుటి) 8 అ.
సాంసారిక జీవితం ప్రతి
బింబించే తియ్యని చిన్ని
కథలు.

౪. ప్రవాళం (కథాసంపుటి) 8 అ.

వ్యవస్థాపకులు:

**అక్కపెద్ది సత్యనారాయణ, P. O. L.**
హిందూహైస్కూలు, బెజవాడ.

&

**విద్వాన్ పైడిపాటి సుబ్బరామశాస్త్రి.**
కాయపురం, ఉయ్యూరు పోష్టు.

# త్వరలో

## తపతీసంవరణము
మహాకావ్యము

## అమృతవల్లి
నవల

## తెలుఁగు వెలుఁగు
పద్యకావ్యము

Printed by I. V, Ratnam, M. Sc., at A. G. Press, Bezwada, 1943.